



# శంకర భావలహరి



శ్రీ శ్రీ శ్రీ
ఆది శంకరులు
సంస్కృతములో రచించిన
చిన్న రచనలకు
తెలుగులో
గేయ రూపమున
స్వేచ్ఛానువాదము
(మూలముతోసహా)

గేయ రచయిత
సామవేదుల సీతారామశాస్త్రి

శ్రీ శైలజ పబ్లికేషన్స్
స్వామివీధి, గాంధీనగర్,
విజయవాడ–520 003

**SANKARA BHAVALAHARI**

(With Telugu Narration)

By

**Samavedula Seetharama Sastry**

First Edition :
May 1991

Copies ; 1000

**Price : Rs. 20/-**



Cover Design :
**R A M A N A**

Copies can be had from :

**S. SEETHARAMA SASTRY**
47-3-13, Dwarakanagar
Visakhapatnam-530 016

A N D

**SRI SAILAJA PUBLICATIONS**
Swami Street, Gandhi Nagar
Vijayawada - 520 003

Printed at :
**"RAGHAVENDRA"**
S.N. Puram, V. Z. A. 11.

# అంకితము

1. తనువు, మనములు, బుద్ధి వేరుగ
నుంట చేతనె విశ్వమందున
విభిన్నత్వము గోచరించును
ఆత్మ ఒక్కటె అయినయున్.

2. తనువులొకటై మనసులొకటై,
యున్నచోటున భిన్నమెక్కడ ?
తనువు మనసులు కరగుచోటున
అద్వయమ్మె అంతయున్.

3. ఉన్నయప్పుడు, లేనియప్పుడు
భిన్నమెరుగని జీవితమ్మున
ఉన్నదంతయు ప్రేమభావమె,
తరుగుపెరుగని శాంతియే.

4. కాలవాహినిలోన నాలుగు
పదులకాలము కలిసి సాగిన
జీవితమ్మున చివరివరకున్
మధురిమలె కురిపించెగా.

5. తనువు, తీరని రోగమున, కృశి
యించిపోవుచునున్నగూడన్,
అంతరంగమునందు శాంతమె,
మోముపై చిరునవ్వులే.

6. పూవుపుట్టిన మొదలు నేలకు
రాలువరకున్ పరిమళమ్మును
దిక్కులన్నిట దిమ్మరించెడి
రీతి గడపెను కాలమున్

అట్టి
నా సహధర్మచారిణి,
కష్టసుఖముల భాగస్వామిని,
జ్ఞాన సంపన్న, అయిన
కీ. శే. శ్రీమతి వెంకటరత్నమునకు

ఇది
నేను ఇవ్వగలిగిన
శాశ్వతమయిన తుదికానుక.
— శ్రీ కృష్ణార్పణమస్తు —

# స్వపరిచయము

నా పేరు సీతారామశాస్త్రి. ఇంటిపేరు సామవేదుల వారు. ఆరామద్రావిడశాఖ; భారద్వాజస గోత్రము.

మా తండ్రిగారు శ్రీ వెంకటశాస్త్రిగారు, ప్రభుత్వ ఉద్యోగిగా పనిచేసి, దివంగతులయిరి. మా తల్లి మ.ల.స. మహాలక్ష్మి. ఆమె గూడ తండ్రిగారి ననుసరించినది. మా తాతగారు కీ.శే. శ్రీ సామవేదుల గోపాలశాస్త్రిగారు సంస్కృతములో మహాపండితులు. సామవేదములో నిష్ణాతులు.

నేను సింగరేణి బొగ్గుగనులలో వివిధ భాగములలో పనిచేసి, చివరకు బెల్లంపల్లిలో జనరల్ మేనేజరుగా పదవీవిరమణ చేసితిని. మా పితృ పితామహుల నివాస స్థానము బొబ్బిలి అయినను, నేను ప్రస్తుతము విశాఖపట్టణములో ఉన్నాను.

నా భార్య చి॥ సౌ॥ వెంకటరత్నము, రెండు సంవత్సరముల క్రిందట (27-1-89 న) కేన్సరు వ్యాధివలన మరణించినది. ఆమెకు అత్యంత ప్రియమయిన ఈ గేయరచనలను ఆమెకే అంకితము ఇచ్చుచున్నాను.

భగవంతుడు ఆమె ఆత్మకు శాంతిని ప్రసాదించుగాక !

47-3-13

ద్వారకానగరం

విశాఖపట్నం.

సామవేదుల సీతారామశాస్త్రి

# ముందుమాట

శ్రీ ఆది శంకరులు అద్వైత వేదాంత సిద్ధాంత నిర్మాత అని చెప్పవచ్చును ప్రస్థానత్రయానికి (ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత) భాష్యం వ్రాయడమే కాక, అనేక వేదాంత గ్రంథములను, స్తోత్రములను, చిన్నచిన్న రచనలను, ఎన్నియో వ్రాసిరి. ఒక్కొక్కటి ఒక్కొక్క మచ్చుతునక. కవిత్వము కల్పనా చాతుర్యము ఎంత కమనీయంగా ఉంటాయో, వాటిలోని భావాలు అంత గంభీరంగానూ ఉంటాయి. మాటలలో ఆయన ఏదయినా చిత్రీకరించేరంటే, అది కళ్ళకు కట్టినట్టే ఉంటుంది.

ఆయన రచనలలో కొన్నింటిని - చిన్నవాటిని తీసుకొని, వాటిని తేలికయిన మాటలలో, అందరకు అర్థమయే విధంగా, పాడుకుందుకు వీలుగా ఉండేటట్లు, గేయ రూపంలో వ్రాద్దామన్న అభిలాషతో, ఈ సాహసానికి దిగేను. మూలంలోని భావము కుంటుపడకుండా ఉండేటట్లు ప్రయత్నించేను.

ఇందులో 'ఆత్మబోధ' శుద్ధ అద్వైత వేదాంత సారము. 'బ్రహ్మజ్ఞానావళి' బ్రహ్మతత్వం తెలుసుకున్న ఒక మహాజ్ఞాని ఆనందరవళి 'భజగోవిందం'-ప్రాపంచిక జీవితంలోని మిథ్యాతత్వానికి దర్పణం. 'దక్షిణామూర్తి స్తోత్రం' గురుస్తుతి అయినా-అది కాచి వడబోసిన బ్రహ్మజ్ఞానం. 'పరాపూజ' (బ్రహ్మమానస పూజ అని చెప్ప బడినా), నిత్యానంద స్వరూపుడయిన పరబ్రహ్మయొక్క. అనంతత్వం ముందు మన అల్పత్వాన్ని కొట్టవచ్చినట్లు కన్పింపజేసే ఒక చిత్రపటం. 'నిర్వాణషట్కం' సమాధిస్థితిలోనున్న సాధకుని అంతిమ అనుభవం. అక్కడ ఉండేదీ, అనుభవించేదీ చివరకు మిగిలేదీ - చిదానంద మొక్కటే —

'దుఃఖనివృత్తి' శ్లోకాలలోని భావగంభీరత, మాటల వాడకంలోని పొదుపు, వాటివెనుకనున్న అనంతమయిన సత్యము ఆయన రచనా శైలికి నిదర్శనము. 'కౌపీన పంచకం'-ఆనందోత్సాహాలు ఆస్తిపాస్తుల వల్ల వచ్చేవి కావనీ, వాటిపట్ల ఏ మాత్రం ఆశచూపని వానివే నిజమయిన ఆనందమనీ చెప్పే నగ్నసత్యం.

'శివాపరాధక్షమాపణ స్తోత్రం'లో మానవుని జీవిత మంతా ఒక తెమ్మెరద చూపబడింది. పుట్టినప్పటి నుండి చనిపోవు వరకు, అతని దేవులాటలన్నీ ఈ ప్రాపంచిక సుఖాల కోసమే. దేవుడు ఎప్పుడూ జ్ఞాపకానికిరాడు; వచ్చినా వానిని చేరుకొనే మార్గం తెలీదు; తెలిసినా, ఆ మార్గాలను అవలంబించాలనే ఇచ్ఛగాని, ఉత్సుకతగాని ఉండదు. ఎప్పుడో చనిపోయే ముందు జ్ఞాపకం వస్తుంది - తను నడుస్తున్న మార్గం తప్పుఅనీ, తను దేవుని యందు అపరాధం చేస్తున్నానని-కాని, అప్పటికే సమయం మించిపోతుంది. అయినా కొద్దిపాటి పూర్వ సంస్కారం ఉంది గాబట్టి, అప్పటికయినా మేలుకొని ఆ పుణ్యాత్ముడు శంకరుని శరణువేడుకోగలిగేడు. ఆ పాటి అవకాశం ఉపయోగించుకోగలిగేవారెంతమంది ?

వీటిని నా కోసం నేను వ్రాసుకున్నా. వీటిని ప్రచురించవలసిందిగా, మా తమ్ముడు చి॥ నరసింహమూర్తి, అల్లుడు చి॥ అవధానుల జగన్నాధరావు, మా అమ్మాయి చి॥సౌ॥ విజయలక్ష్మి, పట్టు పట్టుటవలన ప్రచురించుట జరిగింది.

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతలు.

పాఠకులు వీటిని సహృదయంతో స్వీకరించి, చదివితే అదే నాకు ఎంతో ఆనందం —

ఇట్లు,

సామవేదుల సీతారామశాస్త్రి

# విషయ సూచిక

# 1. ప్రాతః స్మరణ స్తోత్రం

1. ప్రాతర్స్మరామి హృది
 సంస్ఫుర దాత్మతత్వం,
 సత్-చిత్-సుఖం పరమ —
 హంసగతిం తురీయం,
 యత్ స్వప్న-జాగర-సుషుప్త —
 మవైతి నిత్యం,
 తత్ బ్రహ్మ నిష్కల మహం
 న చ భూత సంఘః

# ప్రాతఃకాలస్మరణ

ఉదయాననే లేచి, శంకరా!

నిను నేను

మదిలోన స్మరియింతు, భవహరా! ॥ఉదయాననే॥

సచ్చిదానందమై,

సాంతమ్ము శాంతమై,

పరమహంసలరీతి,

పరవశించుచు హృదిలో,

మూడవస్థల యందు

ముచ్చటగ తిరిగేటి

ఆత్మ తత్వమె నీవు, శంకరా!

అదె నేను

భూత సంఘము కాను, భవహరా! ॥ఉదయాననే॥

2. ప్రాతర్భజామి మనసో
వచసా మగమ్యం,
వాచో విభాంతి నిఖిలా
యదను గ్రహేణ,
యన్నేతి నేతి వచనై
ర్నిగమా అవోచుః
తం దేవదేవ మజ
మచ్యుత మాహు రగ్ర్యం.

3. ప్రాతర్నమామి తమసః
పరమర్క వర్ణం,
పూర్ణం సనాతన పదం,
పురుషోత్తమాఖ్యం,
యస్మిన్ ఇదం జగద
శేష మశేష మూర్తౌ,
రజ్వాం భుజంగమ ఇవ
ప్రతి భాసితం వై.

నేతివాదము చేత

నిన్ను దెల్పగజాలు,

వేదాల వెలిగించు

ఓ, దేవదేవ, నిను

మాటలలో తెలుపగా,

మదిలోన తలపగా,

నాతరమె చెప్పనూ, శంకరా !

నాలోని ....

ఆత్మ తత్వమె నీవు, భవహరా! ॥ఉదయాననే॥

అజ్ఞానమును ద్రోలు

ఆదిత్య రూపుడవు.

పురుషోత్తముడ వీవు,

పూర్ణుడవు: రజ్జువున

సర్పంబువలె నీలొ

సర్వమ్ము పొడగట్టు,

ఆదిపురుషుడవీవు, శంకరా!

నాలోని

ఆత్మతత్వమె నీవు, భవహరా! ॥ఉదయాననే॥

# 2. భజగోవిందం

1. భజగోవిందం, భజగోవిందం,
గోవిందం భజ మూఢమతే,
సంప్రాప్తే సన్నిహితే కాలే,
నహి, నహి, రక్షతి డుకృం కరణే

2. మూఢ జహీహి ధనాగమ తృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాం
యల్లభసే నిజ కర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తం

3. నారీ స్తనభర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశం
ఏతన్మాంస వసాది వికారం
తత్పరి చింతయ వారం వారం

4. నలినీ దలగత జలమతి తరలం,
తద్వజ్జీవితమతిశయ చపలం;
విద్ధివ్యాధ్యభి మానగ్రస్తం,
లోకం శోకహతం చ సమస్తం.

5. యావద్విత్తోపార్జనసక్తః
తావన్నిజ పరివారో రక్తః
పశ్చాజ్జీవతి జర్జర దేహే
వార్తా కోఽపి న పృచ్ఛతిగేహే

# గోవిందా హరి

గోవిందా హరి, గోవిందా యని
భజన సేయరా, మందమతీ !
కూటికి నేర్చిన కోటి విద్దెలూ
కాలము మీరిన కాపవురా.

మూఢా, ధనమున దాహము వీడుము;
సత్య బుద్ధినే మనమున నిలుపుము;
నీ నీ కర్మల పొందిన దానితో
సంతసింపుమా మనమున నెంతో

ఆడువారి బిగిచన్నులు, పొట్టలు
చూచి మోహమున వేయకు లొట్టలు;
కొవ్వు మాంసమే అందము వాటికి,
మదిలోనెంచుము మాటికి మాటికి.

తమ్మిరేకుపై నీటిబొట్టురా,
నిడకడ లేనిది జీవితమ్మురా;
రోగాల్ రోషాల్ నిండిన లోకము
అన్నిట కలిగెడి దంతా శోకము.

సంపాదనలో బిగు వెన్నాళ్ళో,
బంధుజనమ్ముల ప్రేమన్నాళ్ళే;
బ్రతికెదరింకా ముదుసలి తొక్కులు,
అడుగరింటిలో వారిని ఒక్కరు.

6. యావత్పవనో నివసతి దేహే,
తావ త్పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మిన్కాయే

7. బాలస్తావత్క్రీడా సక్తః
తరుణస్తావ త్తరుణీ సక్తః
వృద్ధస్తావచ్చింతాసక్తః,
పరస్మిబ్రహ్మణి కోఽపి న సక్తః.

8. కాతే కాంతా, కస్తే పుత్రః;
సంసారోఽయ మతీవ విచిత్రః
కస్యత్వం కః కుత ఆయాత-
స్తత్త్వం చింతయ తదిహ భ్రాంతః

9. సత్సంగత్వే, నిస్సంగత్వం,
నిస్సంగత్వే, నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం,
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః

10. వయసి గతే కః కామ వికారః
శుష్కే నీరే కః కాసారః
క్షీణే విత్తే కః పరివారో
జ్ఞాతే తత్త్వే కః సంసారః

11. మాకురు ధనజన యవ్వన గర్వం
హరతి నిమేషాత్కాలః సర్వం;
మాయామయమిద మఖిలం బుద్ధ్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశవిదిత్వా.

ఊపిరాడుచును ఉంటే ఒంటను
కుశల ప్రశ్నలు వేసెదరింటను;
ఊపిరాగి అది శవమై మిగిలిన,
ఆలే భయపడు దానిని జూచిన.

చిన్నతనములో ఆటల చెంత;
యవ్వనమ్ములో యువతుల పొంత;
వృద్ధాప్యమ్మున చింతల వంత;
లేదెవరికి పరబ్రహ్మలో చింత.

నీయాలెవ్వరు? కొడుకెవ్వడురా?
కడువిచిత్రమే సంసారమురా;
ఎవరివాడ వెటనుండిర వచ్చుట?
ఎవడవీవు? అది తెలియుము యిచ్చుట.

సత్సంగతిచే నిస్సంగత్వము,
నిస్సంగతిచే నిర్మోహత్వము;
మోహరహితమున నిశ్చలతత్వము,
నిశ్చలతన్ గను జీవన్ముక్తిని.

వయసు మళ్ళినచో, వాంఛలెక్కడివి?
జలము లెండినచో, చెరువులెక్కడివి?
డబ్బుపోవ, పరివారమెక్కడిది?
సత్యమెరుగ సంసారమెక్కడిది?

డబ్బు, వయసు, పరివారము సర్వము
పోవు నిముసమున; వీడుము గర్వము;
మాయామయమిదియంతా తెలియుము;
బ్రహ్మపదమ్మునెరిగి కలియుమా.

12. దినయామిన్యౌ, సాయం ప్రాతః
శిశిర వసంతౌ పునరాయాతః
కాలః క్రీడతి, గచ్ఛత్యాయుః,
తదపి న ముంచ త్యాశావాయుః

13. కాతే కాంతా ధనగత చింతా,
వాతుల కిం తవ నాస్తి నియంతా,
త్రిజగతి సజ్జన సంగతిరేకా
భవతి భవార్ణవ తరణే నౌకా.

14. జటిలో, ముండీ, లుంఛితకేశః,
కాషాయాంబర బహుకృతవేషః,
పశ్యన్నపిచ న పశ్యతి మూఢో,
హ్యుదర నిమిత్తం బహుకృతవేషః.

15. అంగం గలితం, పలితం ముండం,
దశన విహీనం జాతం తుండం;
వృద్ధో యాతి గృహీత్వా దండం,
తదపి న ముంచత్యాశా పిండం.

16. అగ్రేవహ్నిః, పృష్ఠే భానూ
రాత్రౌ చుబుక సమర్పిత జానుః
కరతల భిక్ష స్తరుతలవాసః
తదపి న ముంచత్యాశాపాశః

17. కురుతే గంగా సాగరగమనం,
వ్రత పరిపాలన మథవా దానం;
జ్ఞానవిహీనః సర్వమతేన
ముక్తిం న భజతి జన్మశతేన.

పగలు, రేలు, ఉదయాస్తమయాలు,
శిశిరవసంతాల్ తిరిగి తయారు;
కాలము గడచును; తరుగును ఆయువు;
విడువదప్పటికి నాశావాయువు.

ఏలర కాంతాధనముల చింత?
మూఢా, లేదా నీకు నియంత?
ముజ్జగములలో సుజనుల సేవలె
భవాంబుధిని దాటించెడి నావలు.

జటలట, గుండట, పెరికిన కురులట;
కాషాయాలతో పలు వేషాలట;
కానగలిగి కనలేడు పరమ్మును;
పొట్టకూటికే యీ వేషమ్ములు.

దేహము సడలెను; జుత్తుయు పండెను;
నోటనున్న పళ్ళన్నియు నూడెను;
కర్ర సాయమున కదులును ముదుసలి,
అయినా వీడదు వాంఛల నాకలి.

ముందు మంటసెగ; వెనుక నెండపొడ;
రాత్రి ముణుకులతో తలతో ముసుగడ;
చేతితో బిచ్చం, తరుతల వాసం,
అయినా వీడదు ఆశాపాశం.

గంగాసాగర యాత్రల జేయును;
వ్రతములు సలుపును; దానము సేయును;
కాని, జ్ఞానమును పొందని మందుడు
జన్మజన్మలకు ముక్తిని పొందడు.

18. సురమందిరతరుమూలనివాసః
శయ్యా భూతల మజినం వాసః
సర్వ పరిగ్రహ భోగ త్యాగః,
కస్య సుఖం న కరోతి విరాగః

19. యోగరతోవా, భోగరతోవా,
సంగరతోవా సంగవిహీనః
యస్య బ్రహ్మణి రమతే చిత్తం,
నందతి, నందతి, నందత్యేవ.

20. భగవద్గీతా కించి దధీతా,
గంగాజల లవకణికా పీతా,
సకృదపి యేన మురారి సమర్చా,
క్రియతే తస్య యమేన న చర్చా.

21. పునరపి జననం, పునరపి మరణం,
పునరపి జననీ జఠరే శయనం;
ఇహ సంసారే బహు దుస్తారే,
కృపయాఽపారే పాహి మురారే.

22. రథ్యా చర్పట విరచితకంథః;
పుణ్యాపుణ్య వివర్జిత పంథః,
యోగీ యోగనియోజిత చిత్తో,
రమతే బాలోన్మత్తవదేవ.

23. క స్త్వం, కోఽహం, కుత ఆయాతః;
కా మే జననీ, కో మే తాతః;
ఇతి పరిభావయ, సర్వమసారం,
విశ్వం త్యక్త్వా స్వప్నవిచారం.

మనుగడ గుడిలో చెట్టుక్రిందనే:
కట్ట చర్మమే: పడక నేలనే:
వాంఛా భోగములన్నిట త్యాగమె:
ఎవనికీదు సుఖమట్టి విరాగము !

యోగమందునన్, భోగమందునను,
ఒక్కడె యున్నన్, బెక్కురయున్నను,
మనసు బ్రహ్మమున నిలుపువానికిక
ఆనందము మహదానందమ్మే !

భగవద్గీతను కొంచెము చదివిన,
గంగాజలమొక బిందువు త్రావిన,
కొంచెమయిన స్మరియింప మురారిని,
యముడు కూడ దరిజేరడు వారిని.

మరి మరి పుట్టుట, మరిమరి చచ్చుట,
తల్లిపొట్టకే మళ్ళీ వచ్చుట:
ఈ సంసారము కడు దుస్తారము,
చూపు మురారీ కరుణనపారము.

భుజమున పీలికలతికిన బొంతతో,
మంచి చెడ్డలను మీరిన నడతతో,
యోగి యోగమున నిలిపి చిత్తమును,
బాలోన్మతులవలె గను ముదమును,

నీవు, నేను, తలిదండ్రులు ఎవరుర?
ఎటుల వచ్చితిమి? భావనసేయర:
సారములేనివి, లోకపు సొంపులు,
ఫీడుము; ఇవి కలలోని తలంపులు,

24\. త్వయి మయి చాన్యత్రైకో విష్ణుః,
వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః,
భవ సమచిత్తః సర్వత్ర త్వం
వాంఛస్యచిరాద్యది విష్ణుత్వం

25\. శత్రౌ, మిత్రే, పుత్రే, బంధౌ,
మాకురు యత్నం విగ్రహ సంధౌ;
సర్వస్మిన్నపి పశ్యాత్మానం,
సర్వత్రోత్సృజ భేదాజ్ఞానం.

26\. కామం, క్రోధం, లోభం, మోహం,
త్యక్త్వాఽఽత్మానం పశ్యతి సోఽహం;
ఆత్మజ్ఞాన విహీనా మూఢా—
స్తే పచ్యంతే నరక నిగూఢాః

27\. గేయం గీతానామసహస్రం
ధ్యేయం శ్రీపతిరూప మజస్రం;
నేయం సజ్జన సంగే చిత్తం,
దేయం దీనజనాయ చ విత్తం.

28\. సుఖతః క్రియతే రామాభోగః
పశ్చాత్ హంత, శరీరే రోగః
యద్యపిలోకే మరణం శరణం.
తదపి న ముంచతి పాపాచరణం

29\. అర్థమనర్థం, భావయ నిత్యం;
నాస్తి తతః సుఖలేశః సత్యం;
పుత్రాదపి ధనభాజాం భీతిః,
సర్వత్రైషా విహితా రీతిః

నీలో, నాలో నన్నిట గనుమా
విష్ణు వొక్కనిని; కోపము మానుము;
అన్నింటను సమబుద్ధిని యుంచుము,
త్వరలో విష్ణుత్వమ్మును గాంచుము.

శత్రువు, మిత్రుడు, పుత్రుడు, బంధుగు
లందు, ద్వేషరాగాలను పొందకు;
ఆత్మ నొక్కటిగ జూడు మన్నిటను,
భేద భావమును వీడుమన్నిటను.

కామము, క్రోధం, లోభము, మోహం,
వీడనాత్మలో తోచును 'సోఽహం';
ఆత్మజ్ఞానము మూఢుడు పొందక,
నరకములోపడి బాధలు పొందును.

గీతా సహస్ర నామాల్ చదువుము;
ఎప్పుడు శ్రీపతి రూపమె తలపుము;
సతతము సుజనుల పొందును గోరుము,
దీనజనాళికి దానము సేయుము.

ముదమున పొందెను యువతుల భోగము;
తదుపరి కలిగెను, అయ్యో, రోగము;
చచ్చిపోవుటే శరణం బైనను,
చేయ మానడే పాపమ్మయినను.

డబ్బు చెడ్డదది తెలియుము నిత్యము;
సుఖము నీయదే కొంచెము; సత్యము;
కొడుకునకే ధనవంతుడు గడగడ,
లోకములన్నిట ఇదియే పోకడ.

30. ప్రాణాయామం, ప్రత్యాహారం,
నిత్యా నిత్య వివేకవిచారం,
జాప్య సమేత సమాధి విధానం
కుర్వవధానం మహదవ ధానం.

31. గురు చరణాంబుజ నిర్భర భక్తః
సంసారా దచిరాద్భవ ముక్తః:
సేంద్రియ మానస నియమాదేవం,
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవం.

భజగోవిందం, భజగోవిందం,
గోవిందం భజ మూఢమతే,
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృంకరణే.

— 0 —

శంకరభాషలహరి

ప్రాణాయామము, ప్రత్యాహారము,
నిత్యా నిత్యము లెరుగు విధానము;
జపసమేత సమాధి విధానము,
సలుపు జాగ్రతతో, సావధానము.

గురు పాదమ్ముల గొలిచెడి భక్తుడు
త్వరలో నగు సంసారవిముక్తుడు;
మనసేంద్రియముల నియమించిననే
కాంతువు దేవుని, నీ హృదిలోనే.

గోవిందాహరి, గోవిందా యని
భజన సేయరా, మందమతీ;
కూటికి నేర్చిన కోటి విద్దెలూ
కాలము తీరిన కాపవురా.

— 0 —

# 3. బ్రహ్మజ్ఞానావళి

1. అసంగోఽహం, అసంగోఽహం,
అసంగోఽహం, పునః పునః
సచ్చిదానంద రూపోఽహం,
అహమేవాహమవ్యయః.

2. నిత్య శుద్ధ విముక్తోఽహం,
నిరాకారోఽహ మవ్యయః
భూమ్యానంద స్వరూపోఽహం,
అహమేవాహమవ్యయః.

3. నిత్యోఽహం, నిరవద్యోఽహం,
నిరాకారోఽహమవ్యయః
పరమానందరూపోఽహం
అహమేవాహమవ్యయః

4. శుద్ధ చైతన్య రూపోఽహం
ఆత్మారామోఽహమేవచ
అఖండానందరూపోఽహం,
అహమేవాహమవ్యయః.

# బ్రహ్మానందరవళి

సంగరహితుడ, సంగరహితుడ,
సంగరహితుడ నెల్లవేళల;
సచ్చిదానంద స్వరూపుడ,
నేను నేనే, అవ్యయున్

నిత్య, నిర్మలు, వినిర్ముక్తుడ,
నిరాకారుడ, నాశరహితుడ;
పూర్ణమగు ఆనందరూపుడ,
నేను నేనే - అవ్యయున్

అవధులెరుగని శాశ్వతుండను;
తరుగు పెరుగని రూపరహితుడ;
పరమమగు ఆనందరూపుడ
నేను నేనే — అవ్యయున్

శుద్ధమగు చైతన్యరూపుడ,
ఆత్మలో రమియించువాడను;
అఖండానందస్వరూపుడ
నేను నేనే — అవ్యయున్

5. ప్రత్యక్ చైతన్య రూపోఽహం,
శాంతోఽహం, ప్రకృతేః పరః
శాశ్వతానంద రూపోఽహం
అహమేవాహ మవ్యయః

6. తత్వాతీతః పరాత్మాఽహం,
మిథ్యాతీతః పరోశివః;
మాయాతీతః పరంజ్యోతిః
అహమేవాహ మవ్యయః

7. నానారూప వ్యతీతోఽహం
చిదాకారోఽహ మవ్యయః;
సుఖరూప స్వరూపోఽహం
అహమేవాహ మవ్యయః

8. మాయాతత్కార్య దేహాది
మమనాస్త్యేవ సర్వదా,
స్వప్రకాశైక రూపోఽహం
అహమేవాహ మవ్యయః

9. గుణత్రయ వ్యతీతోఽహం,
బ్రహ్మాదీనాంచ సాక్ష్యహం;
అనంతానంద రూపోఽహం,
అహమేవాహ మవ్యయః

10. అంతర్యామి స్వరూపోఽహం,
కూటస్థః సర్వగోఽ స్మ్యహం;
పరమాత్మ స్వరూపోఽహం,
అహమేవాహ మవ్యయః.

లోనగల చైతన్యరూపుడ,
శాంతుడన్, ప్రకృతికి భిన్నుడ;
శాశ్వతానందస్వరూపుడ,
నేను నేనే - అవ్యయున్

ఎల్ల తత్త్వాల్ మించు ఆత్మను,
మిథ్యదాటిన పరమ శివుడను;
మాయ మీరిన పరంజ్యోతిని,
నేను నేనే-అవ్యయున్

సకల రూపములధిగమించితి;
చిదాకాశుడ, నాశరహితుడ,
సుఖ స్వరూపముకల్గువాడను,
నేను నేనే - అవ్యయున్

మాయ, మాయచె కల్గు దేహము
లేవికూడను కాను ఎన్నడు;
నా ప్రకాశమె నాదురూపము,
నేను నేనే - అవ్యయున్

మూడు గుణములకతీతుండను,
నేను బ్రహ్మాదులకు సాక్షిని;
అనంతానందస్వరూపుడ,
నేను నేనే - అవ్యయున్

లోన వెలిగెడివాడనై, నే
నాది పురుషుడ, సర్వగామిని;
పరమమగు ఆత్మస్వరూపుడ
నేను నేనే - అవ్యయున్

11. ద్వంద్వాది సాక్షి రూపో౽హం,
అచలో౽హం సనాతనః;
సర్వసాక్షి స్వరూపో౽హం,
అహమేవాహ మవ్యయః

12. ప్రజ్ఞాన ఘన ఏవాహం;
విజ్ఞాన ఘన ఏవచ;
అకర్తాహం, అభోక్తాహం,
అహమేవాహ మవ్యయః

13. నిరాధార స్వరూపో౽హం,
సర్వాధారో౽హమేవచ;
ఆప్తకామ స్వరూపో౽హం
అహమేవాహ మవ్యయః

14. తాపత్రయ వినిర్ముక్తో,
దేహత్రయ విలక్షణః,
అవస్థాత్రయ సాక్ష్యస్మి,
అహమేవాహ మవ్యయః

15. దృక్, దృశ్యౌ, ద్వౌ పదార్థౌ, తౌ
పరస్పర విలక్షణౌ;
దృగ్ బ్రహ్మ; దృశ్యం మిథ్యేతి
సర్వ వేదాంత డిండిమః

16. అహం సాక్షీతి యో విద్యాత్
వివిచ్యైవం పునః పునః,
స ఏవ ముక్తః స విద్వాన్
ఇతి వేదాంత డిండిమః

ద్వంద్వములకున్ సాక్షిరూపుడ,
అచలుడను, నే సనాతనుడను:
సర్వసాక్షి స్వరూపుండను,
నేను నేనే-అవ్యయున్

ఆత్మజ్ఞానమ్మంత నేనే,
శాస్త్రవిజ్ఞానమ్ము నేనే;
కాను కర్తను, కాను భోక్తను,
నేను నేనే-అవ్యయున్

స్వరూపముచే నిరాధారుడ,
సకలమున కాధారభూతుడ,
సదా తృప్తస్వభావుండను,
నేను నేనే-అవ్యయున్

మూడు తాపములకు నతీతుడ:
మూడుదేహములకు విభిన్నుడ:
మూడవస్థలకేను సాక్షిని,
నేను నేనే-అవ్యయున్

దృక్కు, దృశ్యములనెడి రెండే
పదార్థములవి విలక్షణములు:
దృక్కు బ్రహ్మము: మాయ దృశ్యము:
ఇదియె దర్శనసారము.

మాటిమాటికి, తరచి, తరచీ,
'నేను సాక్షిని' యనుచు నెరిగెడి
వాడెముక్తుడు: పండితుండును:
ఇదియె దర్శనసారము.

17. ఘట కుడ్యాదికం సర్వం
మృత్తికా మాత్ర ఏవచ;
తద్వత్ బ్రహ్మ జగత్సర్వం
ఇతి వేదాంత డిండిమః

18. బ్రహ్మసత్యం; జగన్మిథ్యా;
జీవో బ్రహ్మైవ నాపరః
అనేన వేద్యం సచ్ఛాస్త్రం
ఇతి వేదాంత డిండిమః

19. అంతర్జ్యోతి ర్బహిర్జ్యోతిః
ప్రత్యక్ జ్యోతి ర్పరాత్పరః
జ్యోతిర్జ్యోతి ర్స్వయం జ్యోతిః
ఆత్మ జ్యోతి శ్శివోఽస్మ్యహం.

ఓం శాంతిః శాంతిః శాంతిః



కుండలందును, గోడలందును,
ఉన్నదంతయు మట్టి మాత్రమె;
అట్టులే జగమంత బ్రహ్మము,
ఇదియె దర్శనసారము.

బ్రహ్మసత్యము, జగదసత్యము;
జీవుడెవ్వడొ కాడు, బ్రహ్మమె;
ఇటులెరుంగుట సత్యమెరుగుట;
ఇదియె దర్శనసారము.

లోని కాంతిని, బయట కాంతిని,
హృదయకుహరములోని కాంతిని,
పరాత్పరమగు దివ్యకాంతిని,
కాంతులను చూపించు కాంతిని
స్వయంజ్యోతిని, ఆత్మజ్యోతిని,
నే పవిత్రుడ, శివుడను.

ఓం శాంతిః శాంతిః శాంతిః



# 4. నిర్వాణ షట్కం

1\.

మనోబుద్ధ్యహంకార
చిత్తాని నాహం,
న చ శ్రోత్ర, జిహ్వే,
న చ ఘ్రాణ నేత్రే,
న చ వ్యోమ, భూమీ,
న తేజో, న వాయుః,
చిదానందరూపః,
శివోఽహం, శివోఽహం.

2\.

న చ ప్రాణ సంజ్ఞో,
న వై పంచవాయుః,
న వా సప్త ధాతు—
ర్నవా పంచకోశాః
న వాక్పాణి, పాదం,
నచో పస్థ పాయూ,
చిదానంద రూపః
శివోఽహం, శివోఽహం

3\.

నమే ద్వేషరాగౌ
నమే లోభమోహా
మదోనైవ, మేనైవ
మాత్సర్య భావో,
న ధర్మో, న చార్థో,
న కామో, న మోక్షః
చిదానందరూపః
శివోఽహం, శివోఽహం.

# చిదానందుడు

మనసు, బుద్ధియు, చిత్తమును, నే
నహంకారము కానురా,
కాను నేని శ్రోత్ర, నేత్రాల్,
కాను జిహ్వాయు, ఘ్రాణమున్.
కాను నేనీ నింగి, నేలయు,
అగ్ని, వాయువు కానురా,
చిదానంద స్వరూపుడ, నే
శివుడరా, నే శివుడరా.

పంచవాయువు లేను కానుర;
ప్రాణముల్ నే కానురా,
సప్తధాతువు నేను కానుర,
పంచకోశాల్ కానురా;
కాలు, సేతులు, వాక్కు కానుర,
కాను పాయోపస్థలున్
చిదానంద స్వరూపుడ, నే
శివుడరా, నే శివుడరా,

ద్వేషరాగాల్ నాకు లేవుర
లోభ మోహాల్ లేవురా,
మదము లేదుర నాకు జూడగ
మత్సరమ్మును లేదురా,
నాకు ధర్మము, అర్థకామాల్
మోక్షమన్నవి లేవురా,
చిదానంద స్వరూపుడ నే
శివుడరా, నే శివుడరా,

4. న పుణ్యం, న పాపం,
న సౌఖ్యం, న దుఃఖం,
న మంత్రో, న తీర్థం,
న వేదా, న యజ్ఞాః,
అహం భోజనం నైవ,
భోజ్యం న భోక్తా,
చిదానంద రూపః
శివోఽహం, శివోఽహం.

5. న మృత్యుర్నశంకా,
న మే జాతిభేదః,
పితానైవ మేనైవ,
మాతా న జన్మః
న బంధుర్న మిత్రం,
గురూర్నైవ శిష్యః
చిదానంద రూపః
శివోఽహం, శివోఽహం,

6. అహం నిర్వికల్పో,
నిరాకార రూపో,
విభుత్వాచ్చ సర్వత్ర
సర్వేంద్రియాణాం,
నచా సంగతం, నైవ
ముక్తిర్న మేయః
చిదానంద రూపః
శివోఽహం, శివోఽహం,

ఓం శాంతిః, శాంతిః, శాంతిః.

నాకు లేవీ పుణ్యపాపాల్
దుఃఖ సుఖములు లేవురా,
మంత్ర తీర్థాల్ నాకు లేవుర,
వేద యజ్ఞాల్ లేవురా,
భోజనమ్మును కానురా, నే
భోజ్య, భోక్తల కానురా,
చిదానంద స్వరూపుడ, నే
శివుడరా, నే శివుడరా.

లేవు నాకే మృత్యు, భయములు,
జాతిభేదాల్ లేవురా,
లేరు నాకే తల్లిదండ్రులు,
నాకు జన్మయె లేదురా,
బంధు మిత్రులు లేరు, నాకే
గురులు, శిష్యులు, లేరురా,
చిదానంద స్వరూపుడ, నే
శివుడరా, నే శివుడరా.

నిర్వికల్ప స్వరూపుండను,
నిరాకారుడ నేనురా,
సర్వదా సర్వేంద్రియములకు
మహేశ్వరుడను నేనురా,
నాకు లేవీ బంధ మోక్షాల్
మేరకూడను లేదురా,
చిదానంద స్వరూపుడ, నే
శివుడరా, నే శివుడరా!

ఓం శాంతిః శాంతిః శాంతిః

# 5. దుఃఖనివృత్తి శ్లోకాః

1. యావత్కాలం కరేత్కర్మ
తావత్ తిష్ఠంతి జంతవః;
తస్మిన్ క్షీణే వినశ్యంతి;
కా తత్ర పరివేదనా.

2. ప్రాపయంతి మిత్రత్వాతు
కర్మతై కత్ర దేహినః
కర్మక్షయే వియుజ్యంతే
కా తత్ర పరివేదనా.

3. ఋణానుబంధ రూపేణ
పశు పత్ని సుతాలయాః;
ఋణక్షయే లయం యాంతి,
కా తత్ర పరివేదనా.

4. పక్వాని తరుపర్ణాని
పతంతి క్రమశో యథా,
తథైవ జంతవః కాలే
కా తత్ర పరివేదనా.

# దుఃఖమెందుకు ఇందులో

కర్మ చేయుచునుండు వరకే
మనును జీవులు లోకమందున;
కర్మ తరగిన అవి నశించును,
దుఃఖమెందుకు ఇందులో —

కర్మవశమున దేహధారులు
చేరునొకచో లోకమున; అవి
వీడిపోవును కర్మ తరగిన
దుఃఖమెందుకు ఇందులో —

పత్ని, పుత్రులు, పసులు కల్గును
ఋణములో అనుబంధ మట్టుల;
ఋణము తీరగ, పోవు బంధము
దుఃఖమెందుకు ఇందులో —

చెట్టు ఆకులు పండిపోవుచు,
క్రమ క్రమమున రాలునట్టుల,
ఏగు ప్రాణులు కాలవశమున,
దుఃఖ మెందుకు ఇందులో —

5. ఇదంకాష్ఠ మిదంకాష్ఠం,
నద్యాం వహతి సంగమం:
సంయోగాశ్చ, వియోగాశ్చ,
కా తత్ర పరివేదనా.

6. ఏక వృక్ష సమారూఢా
నానా జాతి విహంగమాః
ప్రభాతే విదిశోయాంతి
కా తత్ర పరివేదనా

7. మృణ్మయానిచ భాండాని
బహూని వివిధానిచ;
భిన్నభాండం పరిత్యజ్య
కా తత్ర పరివేదనా

ఓం శాంతిః శాంతిః శాంతిః



కట్టె ఇది; అది కట్టె; నదిలో
కొట్టుకొని అవి పోవుచున్నవి;
కలియు నొకచో, విడును ఒకచో,
దుఃఖమెందుకు ఇందులో —

ఒక్క చెట్టున వచ్చి చేరును
రాత్రి నానాజాతి పక్షులు;
ఉదయమున పలు దిశలకేగును,
దుఃఖమెందుకు ఇందులో —

పలు విధంబుల కుండలెన్నో
మట్టితో చేసినవి యుండును;
పగులు కుండను పారవేతుము,
దుఃఖమెందుకు ఇందులో—

ఓం శాంతిః శాంతిః శాంతిః.



# 6. కౌపీన పంచకం

1. వేదాంత వాక్యేషు సదా రమంతః
భిక్షాన్న మాత్రేణ చ తుష్టిమంతః
అశోక మంతఃకరణే రమంతః
కౌపీనవంతః ఖలు భాగ్యవంతః

2. మూలం తరోః కేవల మాశ్రయంతః
పాణిద్వయం భోక్తుమామంత్ర యంతః
కన్యామివ శ్రీమపి కృత్స్న యంతః
కౌపీనవంతః ఖలు భాగ్యవంతః

3. స్వానందభావే పరితుష్టిమంతః
సుశాంత సర్వేంద్రియ వృత్తి మంతః
అహర్నిశం బ్రహ్మసుఖే రమంతః
కౌపీనవంతః ఖలు భాగ్యవంతః

4. దేహాది భావం పరివర్తయంతః
ఆత్మాన మాత్మన్యవలోకయంతః
నాంతం, న మధ్యం, న బాహ్యం స్మరంతః
కౌపీనవంతః ఖలు భాగ్యవంతః

5. బ్రహ్మాక్షరం పావన ముచ్చరంతో,
బ్రహ్మాహమస్మీతి విభావయంతః,
భిక్షాశినో దిక్షు పరిభ్రమంతః
కౌపీనవంతః ఖలు భాగ్యవంతః

ఓం శాంతిః శాంతిః శాంతిః

# కౌపీనధారి

వేదాంతభావార్ధ విజ్ఞాన నిరతుడై
భిక్షాన్నమాత్రాన ప్రీతాత్ముడగుచు,
శోకమెరుగని మనోలోకాల విహరించు
కౌపీనధారియే కడు భాగ్యశాలి.

చెట్టునీడలయందె జీవితమ్మును గడిపి,
అరచేతులందునే యన్నమ్ము దినుచు,
సిరినైన పాపవలె చిన్నగా చూచేటి,
కౌపీనధారియే కడు భాగ్యశాలి.

అంతరంగమునందె ఆనందమందుచును,
సర్వేంద్రియమ్ములన్ శాంతింపజేసి,
బ్రహ్మమందే దివారాత్రముల్ సుఖియించు
కౌపీనధారియే కడు భాగ్యశాలి.

దేహాది భావంపు స్పృహవిడిచిపెట్టి, తన
ఆత్మనవలోకించి, ఆత్మలో, తాను
మధ్యాంత బాహ్యముల స్మరియింపకనెయుండు
కౌపీనధారియే కడు భాగ్యశాలి.

పావనంబగు బ్రహ్మవాక్కునే పలుకుచును,
'నేను బ్రహ్మను' యనుచు నెంచుచున్ మదిలో,
దిరిప మెత్తుచు, ఎల్లదిశలందు తిరుగాడు
కౌపీనధారియే కడు భాగ్యశాలి.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# 7. పరాపూజా

1. అఖండే సచ్చిదానందే
నిర్వికల్పైక రూపిణి
స్థితేఽద్వైతరూపేఽస్మిన్
కథం పూజా విధీయతే.

2. పూర్ణస్యావాహనం కుత్ర,
సర్వాధారస్యచాసనం;
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ,
శుద్ధస్యాచమనం కుతః.

# పరమాత్ముని పూజ

విశ్వమంతయు నిండియుండిన
పరబ్రహ్మను మదిని నిలుపుచు,
పూజసేయుట ఎట్టులే, పర
మాత్మగొలుచుట ఎట్టులే
సచ్చిదానందమ్మునందున
ఒక్కడే అద్వైత భావము
నందునిలిచిన నిర్వికారుని
పూజసేయుట ఎట్టులే - పర
మాత్మ గొలుచుట ఎట్టులే ॥విశ్వమంతయు॥

ఎల్లడన్ గల పూర్ణరూపుని
నెచట కావ్హానింతునే-
అన్నిటికి నాధారభూతున
కాసనమ్మెట వేతునే
ఆసనమ్మెట వేతునే -
స్వచ్ఛరూపున కర్ఘ్యపాద్యము
లిచ్చుటెందుకు చెప్పవే-
అమలరూపుడు, శుద్ధునకు, ఇక
ఆచమనమది ఎందుకే-
ఆచమనమది ఎందుకే- ॥విశ్వమంతయు॥

3. నిర్మలస్య చ కుతః స్నానం
వస్త్రం విశ్వోదరస్య చః
అగోత్రస్య హ్యవర్ణస్య
కుతస్తస్యోపవీతనం:

4. నిర్లేపస్య కుతో గంధః,
పుష్పం నిర్వాసనస్య చ
నిర్విశేషస్య కా భూషా,
కోఽలంకారో నిరాకృతేః

నిర్మలంబగురూపువానికి
నీటస్నానము లెందుకే—
పొట్టలో విశ్వమ్ముకలవా
డెట్టి బట్టలు కట్టునే,
ఎట్టి బట్టలు కట్టునే—
వర్ణగోత్రము లెరుగడట, ఇక
వానికెందుకె జందెముల్;
దేనినంటిని వానికిప్పుడు
దివ్యగంధములెందుకే,
దివ్యగంధములెందుకే— ॥విశ్వమంతయు॥

పూర్వవాసన లేనివానికి
పుష్పగుచ్ఛములెందుకే;
వేషభాషలు లేనివానికి
భూషణమ్ములు ఎందుకే,
భూషణమ్ములు ఎందుకే;
ఆకృతియె లేనట్టివానికి
అలంకారము లెందుకే;
మచ్చలేనటువంటివానికి
ఇచ్చు ధూపంబెట్టిదే,
నచ్చు ధూపం బెట్టిదే; ॥విశ్వమంతయు॥

5. నిరంజనస్య కిం ధూపైః,
దీపైర్వా సర్వసాక్షిణః;
నిజానందైక తృప్తస్య
నైవేద్యం కిం విధీయతే.

6. విశ్వానందాయితుస్తస్య
కిం తాంబూలం ప్రకల్పతే:
స్వయం ప్రకాశచిద్రూపో
యోఽసావర్క భాసకః.

7. ప్రదక్షిణాహ్యనంతస్య
హ్యద్వయస్య కుతో నతిః
వేదవాక్యైరవేద్యస్య
కుతః స్తోత్రం విధీయతేః

స్వయం ప్రకాశమానస్య
కుతో నీరాజనం విధోః,
అంతర్బహిశ్చ పూర్ణస్య
కథముద్వాసనం భవేత్.

సర్వసాక్షికి నూనెదీపపు
సాయమెందుకు చెప్పవే:
అంతరాత్మానందతృప్తున
కారగింపులు ఎందుకే,
ఆరగింపులు ఎందుకే:
అఖిల జగదానందకరునకు
ఆకుపోకలు ఎందుకే,
చూడనంతములేనివానిని
చుట్టి వచ్చుట ఎట్టులే,
చుట్టి వచ్చుట ఎట్టులే: ॥విశ్వమంతయు॥

ద్వైతరహితుండయిన వానికి
దండమెట్టుల పెట్టుతే:
వేదములె వివరింపజాలని
వీనినెట్టుల పొగడుతే,
వీనినెట్టుల పొగడుతే:
స్వయంజ్యోతికి ఇచ్చు నీరా
జనమ్మెట్టిదొ చెప్పవే:
లోనబయటను నిండియుండిన
వాని నంపుట ఎచటకే,
సాగనంపుట ఎచటకే: ॥విశ్వమంతయు॥

9. ఏవమేష పరాపూజా
సర్వావస్థాసు సర్వదా,
ఏకబుద్ధ్యాతు దేవేశే
విధేయా బ్రహ్మవిత్తమైః

10. ఆత్మాత్వం, గిరిజామతిః సహచరాః
ప్రాణాః, శరీరం గృహం;
పూజాతే వివిధోపభోగరచనా,
నిద్రా సమాధిస్థితిః
సంచారం పదయోః ప్రదక్షిణవిధిః
స్తోత్రాణ్యుమస్తా శిరోః
యద్యద్కర్మకరోమి తదఖిలం
శంభో! తవారాధనం.

ఓం శాంతిః శాంతిః శాంతిః



సూర్యభాసకుడాతడే, చి-
ద్రూపమాత్రుండాతడే;
బాహ్యకర్మల వానిజేరెడి
బాటనేదియు గాననే,
బాట నేదియు గాననే;
అంతరంగమునందు వెలిగెడి
అతనికై ఎల్లప్పుడున్
అన్యభావము లేక జేసెడి
ధ్యానమొక్కటె మార్గమే;
ధ్యానమొక్కటె మార్గమే; ॥విశ్వమంతయు॥

శా॥ ఈవే యాత్మవు, శైలజాత మదియున్,
ఈదేహమే గేహమౌ,
సేవల్ నీకు ననేక భోగరతులున్
చిధ్యానమౌ నిద్రయే,
ఏవైపేగిన నీప్రదక్షిణములే,
ఏమాడినన్ స్తోత్రమే,
దేవా! కర్మలనేమి జేసిన భవ-
త్సేవార్థముల్ యన్నియున్

ఓం శాంతిః శాంతిః శాంతిః



# 8. శివాపరాధ క్షమాపణ స్తోత్రం

1. ఆదౌ కర్మప్రసంగాత్ కలయతి కలుషం
మాతృకుక్షౌ స్థితం మాం,
విణ్మూత్రామేధ్యమధ్యే క్వథయతి నితరాం
జాఠరో జాతవేదాః
యద్యద్వై తత్ర దుఃఖం వ్యథయతి నితరాం
శక్యతే కే న వక్తుం.
క్షంతవ్యో మేఽపరాధః శివశివశివభో
శ్రీమహాదేవ శంభో.

2. బాల్యే దుఃఖాతిరేకో మలలులితవపుః
స్తన్యపానే పిపాసా,
నో శక్తశ్చేంద్రియేభ్యో భవగుణజనితా
జంతవో మాం తుదంతి;
నానారోగాది దుఃఖాద్ రుదనపరవశః
శంకరం న స్మరామి.
క్షంతవ్యో మేఽపరాధః శివశివశివభో
శ్రీమహాదేవ శంభో

3. ప్రౌఢోఽహం యౌవనస్థో విషయవిషధరైః
పంచభిర్మర్మసంధౌ
దష్టో, నష్టో వివేకః సుతధనయువతీ
స్వాదు సౌఖ్యే నిషణ్ణం
శైవీ చింతావిహీనం మమహృదయ మహో
మానగర్వాధి రూఢం,
క్షంతవ్యో మేఽపరాధః శివశివశివభో,
శ్రీమహాదేవ శంభో

# మన్నించు మహదేవ, మన్నించు నాతప్పు

ప్రారబ్ధకర్మంపు ప్రాబల్యమున నేను
మాతృగర్భమునందు మలమూత్రములలో
మండేటి జఠరాగ్ని మలమలా మాడ్చగా,
కలుషంపు ముద్దనై సలసలాకాగి,
ఎట్టెట్టి కష్టాల నేనచట పొందితినో
ఎరిగింప శక్యమే ఎవ్వారికయినా,
మన్నించు మహదేవ, మన్నించు నాతప్పు,
శివశివా, శంకరా, భవహరా, శంభో!

బాల్యమ్ములో స్తన్యపానమ్మునకు నేను
విలపించి, తనువెల్ల మలినంబుకాగ,
క్రిమికీటకాల్ నన్ను ఖేదమున ముంపగా,
కాళ్ళేతులను కదుపగా శక్తిలేక
పలురోగములచేత బహుదుఃఖముల పొంది,
కడుశోకమందు శంకరుని మరచితిని;
మన్నించు మహదేవ, మన్నించు నాతప్పు,
శివశివా, శంకరా, భవహరా, శంభో!

పెరిగి నే యువకునై, విషయ విషసర్పముల్
పంచేంద్రియమ్ములన్ పట్టి కాటేయ,
శంకరునిచింత లేశమ్మునూ డనులేని
మదగర్వములతోడ హృదయమ్ము నిండ,
కోల్పోయిబుద్ధి, నే కొడుకనుచు, ధనమనుచు,
మగువయని కడుతీపి మత్తులో పడితిన్;
మన్నించు మహదేవ, మన్నించు నాతప్పు,
శివశివా, శంకరా, భవహరా, శంభో!

4. వార్ధక్యే చేంద్రియాణాం విగతగతిమతి-
శ్చాధి దైవాది తాపైః
పాపైః రోగైర్వియోగై స్త్వనవసితవపుః
ప్రౌఢిహీనం చ దీనం
మిథ్యామోహాభిలాషైః భ్రమతిమమ మనో
ధూర్జటే ధ్యానశూన్యం;
క్షంతవ్యోమేఒపరాధః శివశివశివభో:
శ్రీమహాదేవ శంభో:

5. నో శక్యం స్మార్తకర్మ ప్రతిపదగహన-
ప్రత్యవాయాకులాఖ్యం,
శ్రౌతేవార్తా కథంమేద్విజకుల విహితే
బ్రహ్మమార్గే సుసారే,
నాస్థాధర్మే విచారః శ్రవణ మననయోః
కిం నిధి ధ్యాసితవ్యం;
క్షంతవ్యోమేఒపరాధః, శివశివశివభో:
శ్రీమహాదేవ శంభో:.

6. స్నాత్వాప్రత్యూషకాలే, స్నపనవిధివిధౌ
నాహృతం గాంగతోయం;
పూజార్థం వా కదాచిత్ బహుతర గహనాత్
ఖండబిల్వీదళాని,
నానీతా పద్మమాలా సరసి వికసితా
గంధపుష్పైత్వదర్థం,
క్షంతవ్యోమేఒపరాధః, శివశివశివభో:
శ్రీమహాదేవ శంభో:.

ముదిమిలో ఇంద్రియాల్ మదితోడ గతితప్పి,
తాపత్రయములందు తనువు అల్లాడ,
రోగాలు, పాపాల్వియోగాలతో మనసు
ధైర్యము కోల్పోయి, దైనమ్ము పొంది,
పసలేని ఆశలతో భ్రమియింప మోహాన
పరమేశు ధ్యానమే మరచిపోయితిని;
మన్నించు మహదేవ, మన్నించు నాతప్పు,
శివశివా, శంకరా, భవహరా, శంభో!

స్మార్తమ్ము బహుకష్టసాధ్యమ్ము నే దాని
చేయలేనది విడిచి చేటు కలిగించు;
బ్రాహ్మణుల్ నడిపేటి బ్రహ్మమార్గంబయిన
శ్రౌతమ్ములో నాకు శ్రద్ధ ఎటులుండు;
సద్విచారము లేదు; శ్రవణమననాల్ లేవు,
నిధి ధ్యాసమున నేను నిలచుటదిఎట్లు ?
మన్నించు మహాదేవ, మన్నించు నాతప్పు,
శివశివా, శంకరా, భవహరా, శంభో!

తొలిజామునే తానములజేసి, నీస్నాన
విధికొరకు తేనైతి విన్నదీజలము;
నీపూజకోసమై, నేకష్టపడి బిల్వ
పత్రాల తేనైతి పదిలమ్ముగాను;
సరసిలో వికసించు జలజాతముల మాల
తేలేదు, గంధమ్ము పూలు తేలేదు;
మన్నించు మహాదేవ, మన్నించు నాతప్పు
శివశివా, శంకరా, భవహరా, శంభో!

7. దుగ్ధైర్మధ్వాజ్యయుక్తైర్దధిసితసహితైః
స్నాపితం నైవలింగం,
నోలిప్తం చందనాద్యైః కనకవిరచితైః
పూజితం న ప్రసూనైః
ధూపైః కర్పూరదీపైః వివిధ రసయుతై-
ర్నైవ భక్ష్యోపహారైః
క్షంతవ్యోమేఽపరాధః, శివశివశివభోః
శ్రీమహాదేవ శంభో!

8. నగ్నం నిస్సంగశుద్ధం త్రిగుణ విరహితా
ధ్వస్తమోహాంధకారో,
నాసాగ్రే న్యస్త దృష్టిర్విదిత భవగుణో
నైవదృష్టః కదాచిత్
ఉన్మన్యావస్థయా త్వాం విగతకలిమలాం
శంకరం న స్మరామిః
క్షంతవ్యోమేఽపరాధః శివశివశివభోః
శ్రీమహాదేవ శంభోః

9. చంద్రోద్భాసిత శేఖరే, స్మరహరే,
గంగాధరే, శంకరే,
సర్పైర్భూషిత కంఠకర్ణవివరే,
నేత్రోత్థవైశ్వానరే,
దంతిత్వక్కృత సుందరాంబరధరే,
త్రైలోక్యసారే, హరే,
మోక్షార్థం కురు చిత్తవృత్తి మఖిలాం,
అన్యైస్తు కిం కర్మభిః.

పంచామృతాల్ తెచ్చి, భక్తితో శివలింగ
స్నానాదులను నేను జరిపింపలేదు;
గంధాదులనుపూసి, కనకంపుపూలతో
నే పూజసేయంగనేలేదు నిన్ను;
ధూపాలు, కపురంపుదీపాలు, రసయుక్త
పాకాల సమకూర్చి, భజియింపలేదు;
మన్నించు మహాదేవ, మన్నించు నాతప్పు,
శివశివా, శంకరా, భవహరా, శంభో !

మూడు గుణములవీడి, మోహమున్ నిర్జించి,
సంగమ్ము విడనాడి, శాంతమ్ముతోడ,
నాసాగ్రదృష్టితో నీ సద్స్వరూపమ్ము
నేజూడనేలేదు, ఏనాడుగూడ;
కలిపాపహరుని శంకరుని, నే వెర్రినై,
స్మరియింపనేలేదు, మనమందునెపుడు;
మన్నించు మహాదేవ, మన్నించు నాతప్పు,
శివశివా, శంకరా, భవహరా, శంభో !

చంద్రశేఖర, స్మరహరా, ఓ
శంకరా, గంగాధరా,
ఫణివిభూషితకంఠకర్ణా,
వరకరాగ్ని విలోచనా,
దంతిచర్మాంబరధరా, జగ
దాత్మరూపా, ముక్తికై,
నీలా నిలుపుము నా మనస్సును,
ఏల పలువిధ కార్యముల్
జయము కరుణాసాగరా, హర,
జయము శంభోశంకరా, ॥ జయము కరుణా ॥

10. కింవానేన ధనేన వాజికరిభిః
ప్రాప్తేన రాజ్యేన వా,
కింవాపుత్ర, కళత్ర, మిత్ర, పశుభిః,
దేహేన గేహేన కిం:
జ్ఞాత్వైతత్ క్షణభంగురం, సపదిరే
త్యాజ్యం మనో దూరతః
స్వాత్మార్థం గురువాక్యతో భజ భజ
శ్రీపార్వతీ వల్లభం.

11. ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం
యాతి క్షయం యవ్వనం,
ప్రత్యాయంతి గతాః పునర్నదివసాః
కాలో జగద్భక్షకః,
లక్ష్మీస్తోయ తరంగ భంగ చపలా,
విద్యుచ్చలం జీవితం,
తస్మాన్ మాం శరణాగతం శరణద
త్వం రక్ష రక్షాధునా.

12. కర చరణ కృతం వాః
క్కాయజం కర్మజం వా,
శ్రవణ నయనజం వా
మానసం వాపరాధం,
విహిత మవిహితం వా
సర్వమేతత్ క్షమస్వ
జయ జయ కరుణాబ్ధే
శ్రీమహాదేవ శంభో!

ఓం శాంతిః శాంతిః శాంతిః



ఏల ధన మీ హరులు, కరులున్
    ఏల రాజ్యాల్ భోగముల్,
ఏల భార్యా, పుత్ర, సఖ, పశు
    లేల దేహము, గేహమున్
వీని, క్షణభంగురములను, నీ
    వెరిగి, మనసా, విడువుమా,
గురువు చెప్పగ, నాత్మశుద్ధికై,
    కొలువుమా గిరిజాపతిన్॥ ॥జయము కరుణాసాగరా ॥

తరుగు నాయువు దినదినమ్మును,
    కరుగు యవ్వన కోశమున్,
గతదినమ్ములు తిరిగి రావవి
    కాలమన్నిటి మ్రింగగా,
సిరియు నలమెరె చపల: గడచును
    జీవితమ్మొక మెరుపులా;
కాన, శరణాగతుని కాపను,
    కాపుమా నన్నిప్పుడే. ॥ జయము కరుణాసాగరా ॥

కాలు సేతుల చేతనో, వాక్
    కాయకర్మల చేతనో,
వినుట చూచుట యందునో, నా
    మనమునందో, విహితమ్ములున్
అవిహితమ్ములు అయిన తప్పుల
    నన్నిటిన్ మన్నించుమా,
జయము కరుణాసాగరా, హర,
    జయము శంభో శంకరా.

జయము కరుణాసాగరా, హర,
జయము శంభో శంకరా, ॥ జయము ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః.



★ ★ ★

# 9. దక్షిణామూర్తి ధ్యానం

1. మౌనవ్యాఖ్యా ప్రకటిత పర—
   బ్రహ్మతత్త్వం యువానం,
   వర్షిష్ఠాంతే వసదృషిగణై —
   రావృతం, బ్రహ్మనిష్ఠైః,
   ఆచార్యేంద్రం కరకలిత చిన్—
   ముద్రమానంద రూపం,
   స్వాత్మారామం, ముదిత వదనం,
   దక్షిణామూర్తి మీడే.

2. వటవిటపి సమీపే
   భూమి భాగే నిషణ్ణం,
   సకలమునిజనానాం
   జ్ఞానదాతారమారాత్,
   త్రిభువనగురు మీశం,
   దక్షిణామూర్తి దేవం,
   జనన మరణ దుఃఖ—
   చ్ఛేద దక్షం నమామి.

# గురుస్తుతి

బ్రహ్మనిష్ఠులయిన వృద్ధ—
ఋషులు చుట్టు చేరి వేడ,
చేత జ్ఞానముద్ర జూపి,
మౌనమయిన వ్యాఖ్యతోడ,
బ్రహ్మతత్వమంత గఱపు
యుపకుడైన గురుని, హరుని,
స్వాంత తుష్ఠ ముదితవదను,
దక్షిణాఖ్య గొల్చెదన్

మఱ్ఱిచెట్టు నీడలందు
నేలమీద కూరుచుండి,
పొద్దుపోవువరకు నెల్ల
మునుల కాత్మబోధసేయు,
ముజ్జగమ్ములకును గురుని,
జనన మరణ దుఃఖహరుని,
చిద్స్వరూపు, చిద్విలాసు,
దక్షిణాఖ్య గొల్చెదన్

3. చిత్రం వటతరోర్మూలే
వృద్ధాః శిష్యా గురుర్యువా;
గురోస్తు మౌనం వ్యాఖ్యానం,
శిష్యాస్తు ఛిన్న సంశయాః

4. నిధయే సర్వవిద్యానాం,
భిషజే భవరోగిణాం,
గురవే సర్వలోకానాం,
దక్షిణామూర్తయే నమః

5. ఓం నమః ప్రణవార్థాయ,
శుద్ధ జ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ, ప్రశాంతాయ,
దక్షిణామూర్తయే నమః

ఓం శాంతిః శాంతిః శాంతిః



గురువుజూడ చిన్నవాడు;
ముసలివారు శిష్యులెల్ల;
మూకబోధచేత వారి
ముడులు విడెను, చిత్రమే—

సర్వవిద్యలందు నిధిని,
జన్మరోగ భిషగ్వరుని,
సర్వలోకగురుని, హరుని,
దక్షిణాఖ్యు గొల్చెదన్

ఓంకార రూపుడయిన
శుద్ధ బోధమూర్తి అయిన,
నిర్మలుండు, శాంతుడయిన,
దక్షిణాఖ్యు గొల్చెదన్

ఓం శాంతిః శాంతిః శాంతిః



# 10. శ్రీ దక్షిణామూర్తి స్తోత్రం

1. విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ
తుల్యం నిజాంతర్గతం,
పశ్యన్నాత్మని మాయయా బహిరివో—
ద్భూతం యథా నిద్రయా,
యః సాక్షాత్కురుతే ప్రబోధ సమయే
స్వాత్మానమే వాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే—

2. బీజస్యాంతరివాంకురో జగదిదం,
ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాలకలనా
వైచిత్ర్య చిత్రీకృతం;
మాయావీవ విజృంభయత్యపి మహా
యోగీవ యః స్వేచ్ఛయా,
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే.

# శ్రీ గురుదేవుడు

లోననెగల ఈ విశ్వమ్మంతయు

మాయచె తోచును మన బయటన్

అద్దములోగల పట్టణమట్టుల

కలలోకనబడు జగమటులన్

మెలుకువ కలిగిన అంతా తానే

అద్వైతుడనని తెలిపెడి - ఆ

శ్రీ గురుదేవుని, భక్తవశంకరు

శంకరు మ్రొక్కెద నేను సదా.

బీజములోగల వృక్షమ్మట్టుల

ఆదిని ఈ జగమగు పడకన్

మాయచె తోచెడి దేశపు, కాలపు

చిత్రవిచిత్రపు అల్లికలో,

మాంత్రికువలె, యోగీశ్వరువలె, ఈ

జగమును వ్యక్తము చేసెడి - ఆ

శ్రీ గురుదేవుని, భక్తవశంకరు

శంకరు మ్రొక్కెద నేను సదా.

3. యస్యైవ స్ఫురణం సదాత్మక
మసత్కల్పార్థకం భాసతే,
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా
యో బోధయత్యాశ్రితాన్
యస్సాక్షాత్కరణాత్ భవేన్నపునరా
వృత్తిర్భవాభోనిధౌ,
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే.

4. నానా ఛిద్ర ఘటోదరస్థిత మహా
దీపప్రభా భాస్వరం,
జ్ఞానం యస్యతు చక్షురాదికరణ-
ద్వారా బహిః స్పందతే,
జానామీతి తమేవ భాంతమనుభా-
త్యేతం సమస్తం జగత్
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే.

5. దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం
బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహమితి
భ్రాంతా భృశం వాదినః
మాయాశక్తివిలాసకల్పిత మహా
వ్యామోహ సంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే.

సత్ చిత్ రూపుండయ్యు నసత్తగు
జగతిగ మాయచె కాన్పించన్
ఆశ్రితజనులకు మరుజన్మంబులు
తొలుగుటకై నిజమెరుకపడన్
'అదియే నీవను' శ్రుతివాక్యమ్ముల
సాక్షాత్కారము జేసెడి - ఆ
శ్రీ గురుదేవుని, భక్తవశంకరు,
శంకరు బ్రొక్కెద నేను సదా -

పలు రంధ్రమ్ములు గల భాండములో
ఉంచిన దీపపుకాంతిపలెన్,
కన్నులు మొదలగు ఇంద్రియములలో
తనదగు జ్ఞానమె వెలువడగా
'తెలిసితి, తెలిసితి' నను అనుభూతిని
జగతిని కలుగగ జేసెడి - ఆ
శ్రీ గురుదేవుని భక్తవశంకరు
శంకరు బ్రొక్కెద నేను సదా.

దేహము, ప్రాణము, ఇంద్రియములు, నే
మనసును, బుద్ధిని, శూన్యమనీ,
స్త్రీ బాలాంధ జడోపములందురు
భ్రాంతులు వ్యర్థపు వాదనలన్;
మాయచె కలిగెడి వ్యామోహమ్మును
పూర్తిగ తొలగగజేసెడి—ఆ
శ్రీగురుదేవుని, భక్తవశంకరు
శంకరు బ్రొక్కెద నేను సదా.

6. రాహుగ్రస్త దివాకరేందు సదృశో
మాయా సమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోప సంహరణతో
యో భూత్ సుషుప్తః పుమాన్
ప్రాగ స్వాప్సమితి ప్రబోధసమయే
యః ప్రత్యభిజ్ఞాయతే,
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే.

7 బాల్యాదిష్వపి, జాగ్రదాదిషు, తథా
సర్వాస్వవస్థా స్వపి,
వ్యావృత్తా స్వనువర్తమాన మహమి -
త్యంతః స్ఫురంతం సదా,
స్వాత్మానం ప్రకటీ కరోతి భజతాం
యో ముద్రయా భద్రయా,
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే.

8. విశ్వం పశ్యతి కార్యకారణ తయా,
స్వ స్వామి సంబంధతః;
శిష్యాచార్యతయా, తథైవ పితృ పు-
త్రాద్యాత్మనా భేదతః
స్వప్నే, జాగ్రతివాయ ఏషపురుషో
మాయా పరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం,
శ్రీ దక్షిణామూర్తయే.

రాహువు అడ్డిన రవి శశులట్టుల
మాయచె జ్ఞానము కప్పబడన్
నిద్రావస్థలొ సన్మాత్రుండై
ఉనికిని మరచిన పురుషునికి
'నిద్దురపోతివి' అను జ్ఞాపకమును
అతనికి కలుగగ జేసెడి—ఆ
శ్రీగురుదేవుని, భక్తపశంకరు
శంకరు మ్రొక్కెద నేను సదా.

బాల్యములో, తన వృద్ధాప్యములో
మెలుకువలో, నిదురించుటలో,
సర్వావస్థలయందును మెలిగెడి
వాడను నేనే యనుచు సదా,
ఆశ్రితజనులకు ఆత్మజ్ఞానము
జ్ఞానముద్రతో తెలిపెడి - ఆ
శ్రీ గురుదేవుని, భక్తపశంకరు
శంకరు మ్రొక్కెద నేను సదా.

కారణమిదియను, కార్యమ్మిదియను,
నేనను, నాదను బంధముతో,
శిష్యుడ, గురువను, తండ్రిని, కొడుకును,
అనుచున్ ఆత్మ విభేదముతో,
కలలో జాగృతిలో ఏ పురుషుడు
మాయచె తిరుగుచునుండును - ఆ
శ్రీ గురుదేవుని, భక్తపశంకరు
శంకరు మ్రొక్కెద నేను సదా.

9. ఘూరంభాంస్యనలోఽనిలోఽంబర మహ-
ర్నాథో, హిమాంశుః, పుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మకమిదం
యస్యైవ మూర్త్యష్టకం,
నాన్యత్కించన విద్యతే విమృశతాం
యస్మాత్పరస్మాద్విభోః,
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే.

10. సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం
యస్మాదముష్మిన్ స్తవే,
తేనాస్య స్మరణాత్, తదర్థమననాత్,
ధ్యానాచ్చ సంకీర్తనాత్,
సర్వాత్మత్వ మహావిభూతి సహితం
స్యాదీశ్వరత్వం స్వతః
సిద్ధ్యేత్ తత్పునరష్టధా పరిణతం
చైశ్వర్య మవ్యాహతం.

ఓం శాంతిః శాంతిః శాంతిః



భూనీరమ్ములు, అనలానిలములు,
నింగియు, రవి, శశి, పూరుషులన్
ఎనిమిధి విధముల అతని ప్రకృతి
తోచును అచరాచరములుగా,
అతనికి మించిన దన్యమ్మేదియు
లేదని తెలియగ జెప్పెడి - ఆ
శ్రీగురుదేవుని, భక్తపశంకరు
శంకరు మ్రొక్కెద నేను సదా.

శా॥ సర్వాత్మత్వ స్వరూపమీ స్తవములో
స్పష్టీకృతమయ్యె, నీ
సర్వమ్మున్ విని, సంస్మరించి మదిలో
సంకీర్తనల్ చేయు, ని-
ర్గర్వుల్ పొందెదరీశ్వరత్వమును, స-
ర్వాత్మత్వ భావమ్ముతో
పర్వున్ వారిలొ నష్టసిద్ధులు, మహై-
శ్వర్యమ్ము సంపూర్ణమై.

ఓం శాంతిః శాంతిః శాంతిః



# 11. ఆత్మబోధః

1. తపోభిః క్షీణపాపానాం,
   శాంతానాం వీతరాగిణాం,
   ముముక్షూణా మపేక్ష్యోయం
   ఆత్మబోధో విధీయతే

2. బోధోఽన్య సాధనేభ్యోహి
   సాక్షాత్ మోక్షైక సాధనం;
   పాకస్య వహ్నివజ్ఞానం
   వినా మోక్షో న సిధ్యతే

3. అవిరోధితయా కర్మ
   నాఽవిద్యాం వినివర్తయేత్
   విద్యావిద్యాం నిహంత్యేవ
   తేజస్తిమిర సంఘవత్

4. పరిచ్ఛిన్న ఇవాజ్ఞానాత్
   తన్నాశే కేవలోభవేత్
   స్వయంప్రకాశతేహ్యాత్మా
   మేఘాపాయేంఽశుమానివ

5. అజ్ఞాన కలుషం జీవం
   జ్ఞానాభ్యాసా ద్వినిర్మలమ్
   కృత్వా జ్ఞానం స్వయం నశ్యేత్
   జలం కతకరేణువత్

# ఆత్మబోధ

తపముచే క్షీణింప పాపము,
రాగవర్జితులైన శాంతుల
మోక్షకాముల కొరకు జెప్పిరి
ఆత్మబోధను శంకరుల్.

వంట చేయగ మంటవలెనే,
ముక్తి జ్ఞానమువలన మాత్రమే
కలుగు నితరములైన సాధన
లీయ వెన్నడు మోక్షమున్

కర్మచే నజ్ఞాన మెన్నడు
పోదు; అవి అవిరోధులగుటచే;
జ్ఞాన మజ్ఞానమును తరుమును
కాంతి చీకటి నట్టుల.

ఆత్మ అజ్ఞానమున పరిమిత
మగుచు తోచును; అది తొలంగిన,
ఆత్మ స్వయముగ వెలుగు; మేఘము
తొలగ సూర్యుని యట్టుల.

జీవుడజ్ఞానమున మలినుడు;
కాని నిర్మలు జేసి జ్ఞానము
తాను కూడను తొలగిపోవును,
నీటి నిండుగ పొడివలెన్.

6. సంసారః స్వప్నతుల్యోహి
రాగద్వేషాది సంకులః
స్వకాలే సత్యవద్భాతి,
ప్రబోధే సత్యసద్భవేత్.

7. తావత్సత్యం జగద్భాతి
శుక్తికా రజతం యథా;
యావన్నజ్ఞాయతే బ్రహ్మ
సర్వాధిష్ఠానమద్వయం.

8. ఉపాదానేఽఖిలాధారే
జగంతి పరమేశ్వరే,
సర్గస్థితిలయాన్యాంతి
బుద్బుదానీవ వారిణి.

9. సచ్చిదాత్మన్యనుస్యూతే
నిత్యే విష్ణౌ ప్రకల్పితాః
వ్యక్తయో వివిధాస్సర్వా
హాటకే కటకాదివత్

10. యథాకాశో హృషీకేశో
నానోపాధిగతో విభుః
తద్భేదాద్భిన్న వద్భాతి
తన్నాశే కేవలోభవేత్.

11. నానోపాధి వశాదేవ
జాతి వర్ణాశ్రమాదయః
ఆత్మన్యారోపితాస్తోయే
రస వర్ణాది భేదవత్

ద్వేషరాగయుతమ్ము సంసా-
రమ్ము జూడగ స్వప్నతుల్యము:
గడచునప్పుడు తోచు నిజముగ,
నసత్యమ్మగు మేల్కొనన్

వెండివలె కాన్పించు ముత్యపు
చిప్పవలెనే, జగము నిజముగ
తోచు బ్రహ్మము నెరుగు వరకున్,
సర్వమూలుని నద్వయున్

జగము లఖిలాధారు పర-
మేశ్వరుని లోననే పుట్టు, నిలచును,
నాశమందును నీటిలోగల
బుద్బుదంబుల రీతిగా

నిత్యమై, సర్వత్రగల ఆ
సచ్చిదాత్మన, విష్ణువున, ఈ
సర్వమును కల్పింపబడినవి–
పసిడిలో నగలట్టుల.

పలు ఉపాధులలోన నుండుచె
భిన్నుడై కనుపించు విభుడే
అవి నశింపగ మిగులు నొకటిగ
ఆకశమువలె నంతటన్

పలు ఉపాధులలోన నుండుచె
జాతి వర్ణాశ్రమ విభేదము
లాత్మలో కనుపించు, నీటిలొ
రంగు, రుచి, భేదమ్మగన్.

12. పంచీకృత మహాభూత —
సంభవం కర్మసంచితమ్
శరీరం సుఖదుఃఖానాం
భోగాయతన ముచ్యతే

13. పంచప్రాణ మనోబుద్ధి—
దశేంద్రియ సమన్వితం,
అపంచీకృత భూతోత్థం
సూక్ష్మాంగం భోగసాధనం

14. అనాద్యవిద్యా నిర్వాచ్యా
కారణోపాధి రుచ్యతే:
ఉపాధిత్రితయాదన్య—
మాత్మానమవధారయేత్.

15. పంచకోశాది యోగేన
తత్తన్మయ ఇవ స్థితః,
శుద్ధాత్మా, నీలవస్త్రాది —
యోగేన స్ఫటికోయథా

16. వపుస్తుషాదిభిః కోశై—
ర్యుక్తం యుక్త్యావఘాతతః
ఆత్మానమంతరం శుద్ధం
వివిచ్యాత్తండులం యథా.

17. సదా సర్వగతోఽప్యాత్మా
న సర్వత్రావభాసతే:
బుద్ధావేవావభాసేత
స్వచ్ఛేషు ప్రతిబింబ వత్.

సుఖము దుఃఖము లనుభవింపగ
కలుగు – పంచీకృతమహాభూ–
తములచే–ఈ భోగగృహమగు
కర్మసంచిత దేహము.

పంచప్రాణాల్, మనోబుద్ధులు,
దశేంద్రియములు – అపంచీకృత
భూతముచే కలుగు - భోగపు
సాధనము సూక్ష్మాంగము.

ఆది లేనిది, తెలియరాని, అ–
విద్యకారణదేహమందురు;
ఈ ఉపాధుల మూటికన్నను
ఆత్మ వేరని తెలియుమా.

పంచకోశాదులలో నుంటచె
వాటివలె శుద్ధాత్మ తోచును;
శుద్ధస్ఫటికము నీలవస్త్రము
నందు నీలిగ తోచదే–

లోనగల శుద్ధాత్మ సంతత
మననమున ఈ తనువు మొదలగు
పొట్టునుండి వెలార్చి తెలియుమ
బియ్యమట్టుల వడ్లలో.

ఎల్లవేళల ఎల్లెడన్ గల
ఆత్మకాన్పడదన్నిటను; అది
బుద్ధిలోననె వెలుగు; స్వచ్ఛము–
లందు ప్రతిబింబమువలెన్.

18. దేహేంద్రియ మనోబుద్ధి-
ప్రకృతిభ్యో విలక్షణం,
తద్వృత్తి సాక్షిణం విద్యాత్
ఆత్మానం రాజవత్ సదా.

19. వ్యాపృతేష్వింద్రియేష్వాత్మా
వ్యాపారీవ వివేకినాం,
దృశ్యతేఽభ్రేషు ధావత్సు
ధావన్నివ యథా శశీ.

20. ఆత్మచైతన్య మాశ్రిత్య
దేహేంద్రియ మనోధియః
స్వక్రియార్థేషు వర్తంతే
సూర్యాలోకం యథాజనాః.

21. దేహేంద్రియ గుణాన్కర్మా-
ణ్యమలే సచ్చిదాత్మని
అధ్యస్యంత్య వివేకేన
గగనే నీలతాదివత్

22. అజ్ఞానాన్మానసోపాధేః
కర్తృత్వాదీని చాత్మని
కల్ప్యంతేఽంబుగతే చంద్రే
చలనాది యథాంభసః

23. రాగేచ్ఛా సుఖ దుఃఖాది
బుద్ధౌ సత్యాం ప్రవర్తతే,
సుషుప్తౌ నాస్తి తన్నాశే,
తస్మాద్బుద్ధేస్తు నాత్మనః

## శంకరభావలహరి

శరీరేంద్రియ మనోబుద్ధుల
ప్రకృతికిన్ వేరయ్యు, వానికా
కలుగు వృత్తుల కాత్మ సాక్షిగ
నిలుచు సతతము రాజటుల్.

ఇంద్రియ వ్యాపారములచే
తోచు నాత్మయు చంచలునివలె;
పరుగుపెట్టుచు తోచు శశివలె
మేఘముల్ పర్వెత్తగన్.

శరీరేంద్రియ మనోబుద్ధులు
ఆత్మచైతన్యమును ఆశ్రయ
మంది స్వక్రియలందు మెలగును,
సూర్యకాంతిలో జనులటుల్.

శరీరేంద్రియ కర్మగుణముల
నిర్మలంబగు సచ్చిదాత్మలో
నెంతురవివేకమున—గగనము
నందు పలు రంగులవలెన్.

మనోపాధిగా కలుగు కర్తృ—
త్వాది భావన లాత్మలో కల—
వందురవివేకమున—కదిలెడి
నీట కదిలెడి శశివలెన్.

రాగ మిచ్ఛయు, సుఖము, దుఃఖము,
మనోబుద్ధులలోన కలుగును;
గాఢనిద్రలో యుండవందుచె
ఆత్మలో అవి కలుగవు.

24. ప్రకాశోఽర్కస్య, తోయస్య
శైత్య మగ్నేర్యథోష్ణతా,
స్వభావః సచ్చిదానంద–
నిత్య నిర్మలతాత్మనః

25. ఆత్మనః సచ్చిదంశశ్చ,
బుద్ధేర్వృత్తిరితి ద్వయం
సంయోజ్య చావివేకేన
జానామీతి ప్రవర్తతే.

26. ఆత్మనో విక్రియా నాస్తి,
బుద్ధేర్బోధో న జాత్వితి:
జీవః సర్వమలం జ్ఞాత్వా
జ్ఞాతా ద్రష్టేతి ముహ్యతి.

27. రజ్జు సర్పవదాత్మానం జీవో
జ్ఞాత్వా భయం వహేత్;
నాహం జీవః పరాత్మేతి
జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్.

28. ఆత్మావభాసయ త్యేకో
బుద్ధ్యాదీనీంద్రియాణ్యపి;
దీపో ఘటాది వత్స్వాత్మా
జడై స్తైర్నావభాస్యతే.

29. స్వబోధే నాన్యబోధేచ్ఛా,
బోధరూప తయాత్మనః
న దీపస్యాన్య దీపేచ్ఛా,
యథా స్వాత్మ ప్రకాశనే –

కాంతి రవికిన్ వేడి మంటకు,
నీట చలివలె, సచ్చిదానం—
దములు, నిత్యత, నిర్మలత్వము
స్వభావమ్ములు ఆత్మకున్

ఆత్మలోగల సచ్చిదంశను,
బుద్ధిలో వృత్తులను—రెంటిని
కలిపి యవివేకమున 'తెలిసితి'
ననుచు మెలగును జీవుడు.

ఆత్మచేయదు; బుద్ధి ఎరుగదు;
రెంటి సంయోగమున జీవుడు
'నేను చూచితి; నేను తెలిసితి'
ననుచు మోహము బొందును.

తాడు పామనునట్లు జీవుడు
తనను ఎంచును, భయము చెందును;
ఆత్మనేన్ జీవుండ కానని
ఎరిగి భయమును వీడును.

కుండలను దీపమ్ము వలెనే
స్వప్రకాశము లేని, జడమగు,
మనో బుద్ధుల నింద్రియమ్ముల
నాత్మయే వెలిగించును.

జ్ఞానరూపమ్మాత్మ యగుటచె
నాత్మనెరిగిన, వేరుజ్ఞానము
లేల? — వెలిగెడి దివ్వెజూడగ
వేరు దీపము ఎందుకు?

30. నిషిధ్య నిఖిలోపాధీన్
నేతి నేతీతి వాక్యతః
విద్యాదైక్యం మహావాక్యైః
జీవాత్మ పరమాత్మనోః.

31. అవిద్యాదికం శరీరాది
దృశ్యం బుద్బుదవత్ క్షరం;
ఏతద్విలక్షణం విద్యాత్
అహంబ్రహ్మేతి నిర్మలం.

32. దేహాన్యత్వాన్నమే జన్మ —
జరా కార్శ్యలయా దయః
శబ్దాది విషయైః సంగో
నిరింద్రియ తయా న చ.

33. అమనస్త్వాన్నమే దుఃఖ-
రాగద్వేషభయాదయః,
అప్రాణోహ్యమనాః శుభ్ర
ఇత్యాది శ్రుతి శాసనాత్

34. నిర్గుణో, నిష్క్రియో, నిత్యో,
నిర్వికల్పో నిరంజనః,
నిర్వికారో నిరాకారో
నిత్యముక్తోఽస్మి నిర్మలః

35. అహమాకాశవత్సర్వం
బహిరంతర్గతోఽచ్యుతః
సదా సర్వసమః శుద్ధో
నిస్సంగో నిర్మలోఽచలః

'నేతి' వాదముచే నుపాధుల
నెల్ల విడమము, మహావాక్యము
లాతగొని, జీవాత్మ పరమా —
త్మలలో నైక్యత గాంచుమా.

కారణాదిగ శరీరాదులు
దృశ్యమగునవి నాశమందును,
బుద్బుదాల్ వలె: - నేను వీటికి
వేరు, నిర్మల బ్రహ్మమున్.

చావు, పుట్టుక, ముదిమి, రోగము
లేవు; దేహము కాను కావున:
నే నిరింద్రియునగుట, లేవీ
విషయములలో సంగము.

ద్వేషరాగాల్, భయము, దుఃఖము
లేవు, మనసును కాను గావున;
కాను ప్రాణము, కాను మనమును,
స్వచ్ఛుడన్ అను శృతుల చే-

నిర్గుణుండను, క్రియారహితుడ,
నిత్యు, నిర్మలు, నిర్వికల్పుడ,
నిరంజనుడను, నిర్వికారుడ
నిరాకారుడ, నిత్యముక్తుడ;

నేను ఆకసమటుల సర్వము
లోన బయటను ఆక్రమించియు,
అచ్యుతుండను, సదాశుద్ధుడ,
సంగరహితుడ నచలుడన్.

36. నిత్యశుద్ధ విముక్తైక –
మఖండానంద మద్వయం,
సత్యం జ్ఞాన మనంతం యత్
పరబ్రహ్మాహ మేవ తత్.

37. ఏవం నిరంతరాభ్యస్తా
బ్రహ్మైవాస్మీతి వాసనా
హరత్య విద్యావిక్షేపాన్
రోగానివ రసాయనమ్.

38. వివిక్తదేశ ఆసీనో
విరాగో విజితేంద్రియః
భావయేదేకమాత్మానం
తమనంతమనన్యధీః

39. ఆత్మన్యేవాఖిలం దృశ్యం
ప్రవిలాప్య ధియా సుధీః
భావయేదేకమాత్మానం
నిర్మలాకాశవత్సదా.

40. రూప వర్ణాదికం సర్వం
విహాయ పరమార్థవిత్
పరిపూర్ణ చిదానంద-
స్వరూపేణావతిష్ఠతే.

నిత్య శుద్ధ విముక్తాద్వయ
మగు అఖండానందమే నేన్:
నేను సత్యమనంతజ్ఞానము
నేను తత్పరబ్రహ్మమున్.

ఇటుల నిత్యము నభ్యసింపగ
'నేను బ్రహ్మము' నన్నభావన
త్రోలు మోహాజ్ఞానముల-రో
గముల నౌషధమట్టుల.

నిర్జన స్థలమందు కూర్చొని,
జితేంద్రియుడై, విరాగుండై,
తలపవలె పరమాత్మనొక్కని,
అన్యమెరుగని బుద్ధిచే-

దృశ్యమగు నిద్దానినంతయు,
ఆత్మలో లయపరచి, బుద్ధితో
ఆత్మనే ధ్యానింపవలయును,
నిర్మలాకాశము వలెన్.

రూపముల, వర్ణముల నన్నిటి
విడచి, ఆత్మజ్ఞాని సతతము
పూర్ణమగు ఆ చిదానందుని
స్వరూపముననె నిలచును.

41. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయభేదః
పరే నాత్మని విద్యతే,
చిదానందైక రూపత్వాత్
దీప్యతే స్వయమేవ హి.

42. ఏవ మాత్మారణౌ ధ్యాన-
మథనే సతతం కృతే,
ఉదితావగతిర్జ్వాలా
సర్వాజ్ఞానేంధనం దహేత్.

43. అరుణేనేవ బోధేన
పూర్వం సంతమసే హృతే,
తత ఆవిర్భవేదాత్మా
స్వయమేవాంశుమానివ

44. ఆత్మాతు సతతం ప్రాప్తో
ఽప్యప్రాప్త వదవిద్యయా:
తన్నాశే ప్రాప్తవద్భాతి,
స్వకంఠాభరణం యథా,

45. స్థాణౌ పురుషవద్భ్రాంత్యా
కృతాబ్రహ్మణి జీవతా:
జీవస్య తాత్త్వికే రూపే
తస్మిన్ దృష్టే నివర్తతే

జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయమను భే-
దములు ఆత్మలో లేవు; కేవల
చిదానంద స్వరూపమ్మది,
స్వయందీప్తుండాతడు.

ఈ విధమ్మున నాత్మనరణిగ
జేసి, సతతము ధ్యానమథనము
చేయ పుట్టెడి జ్ఞానవహ్నియె
కాల్చు నజ్ఞానమ్మును.

జ్ఞానమను అరుణుండు ముందుగ
చిమ్మచీకటి పారద్రోలిన
పిదప, స్వయముగ ప్రకాశించును
ఆత్మ సూర్యుని యట్టుల.

ఆత్మ నిత్యము నున్నదయ్యును
లేనియట్టులతోచు నజ్ఞా
నమున; అది నశియింప కాన్పడు
స్వకంఠమ్మున నగపలెన్.

రాటగని నరుడన్న భ్రాంతియు
వలెనె బ్రహ్మరొ జీవభ్రాంతియు;
ఆత్మలో జీవాత్మతత్వము
నెఱుగ తొలగును మోహము.

46. తత్త్వ స్వరూపానుభవా-
దుత్పన్నం జ్ఞానమంజసా
అహం, మమేతి చా జ్ఞానం
బాధతే దిగ్భ్రమాదివత్.

47. సమ్యక్ విజ్ఞానవాన్ యోగీ
స్వాత్మన్యేవాఖిలం జగత్,
ఏకం చ సర్వమాత్మానం
ఈక్షతే జ్ఞానచక్షుషా.

48. ఆత్మైవేదం జగత్సర్వం
ఆత్మనోఽన్యన్న విద్యతే:
మృదోయద్వద్ఘటాదీని
స్వాత్మానం సర్వ మీక్షతే.

49. జీవన్ముక్తస్తు తద్విద్వాన్
పూర్వోపాధి గుణాంస్త్యజేత్.
సచ్చిదానంద రూపత్వాత్
భవేద్భ్రమర కీటవత్

50. తీర్త్వా మోహార్ణవం, హత్వా
రాగద్వేషాది రాక్షసాన్,
యోగీ శాంతి సమాయుక్త
ఆత్మారామో విరాజతే.

ఆత్మతత్వమునెరుగ కలిగెడి
జ్ఞానమున నశియించు శీఘ్రమె
నేను, నాదను అజ్ఞతయు; నిజ-
మెరుగ దిగ్భ్రమ నిలచునా.

సువిజ్ఞానుండయిన యోగియె
చూచు తనలో నఖిలజగముల;
సర్వమునగను నాత్మ నొకటిగ,
జ్ఞానచక్షువుచేత నే-

ఈ జగమ్మంతయును ఆత్మయె,
ఆత్మకానిది లేదు ఎందును;
కుండలన్నిటి మట్టిలోపలె
ఆత్మలో గను సర్వమున్

భ్రమరకీటమువోలె, స్థూలోప-
పాధిగుణముల విడచి, తత్వము
నెరుగు జీవన్ముక్తుడుండును
సచ్చిదానందమ్మునన్.

మోహసంద్రముదాటి, రాగ
ద్వేషలను రాక్షసుల జంపిన,
యోగి, శాంతియుతుండు, ఆత్మా-
రాముడై రాజిల్లును.

51. బాహ్యానిత్య సుఖాసక్తిం
హిత్వాత్మ సుఖనిర్వృతః
ఘటస్థదీపవత్ స్వస్థః
స్వాంతరేవ ప్రకాశతే

52. ఉపాధిస్థోఽపి తద్ధర్మై-
రలిప్తో వ్యోమవన్మునిః
సర్వవిన్మూఢవ త్తిష్ఠే-
దసక్తో వాయువచ్చరేత్.

53. ఉపాధి విలయాద్విష్ణౌ
నిర్విశేషం విశేన్మునిః,
జలేజలం, వియద్వ్యోమ్ని,
తేజ స్తేజసి వాయథా

54. యల్లాభాన్నాపరోలాభో,
యత్సుఖాత్ నాపరం సుఖం,
యజ్ఞానాన్నాపరం జ్ఞానం,
తత్ బ్రహ్మేత్యవధారయేత్

55. యద్దృష్ట్వా నాపరం దృశ్యం,
యద్భూత్వా న పునర్భవః
యజ్ఞాత్వా నాపరం జ్ఞేయం,
తత్ బ్రహ్మేత్యవధారయేత్.

అనిత్యములౌ బాహ్యసుఖముల
విడచి, ఆత్మానందనిరతుడు,
కుండలోగల దివ్వెవలె, తన
యందె వెలుగును, స్వస్థుడై.

ఉపాధులలో నిలచియును, ఆ-
కాశమట్టుల వానినంటడు;
గాలి, మొబ్బులవోలె మెలగును
సర్వమెరిగి, విరాగియై.

ఈ ఉపాధులు నాశమందగ
జ్ఞాని విష్ణుని జేరు పూర్తిగ;
నీరు నీటిలో, మిన్ను మింటను,
కాంతి కాంతిలో యట్టుల.

దేని పొందిన వేరు లాభము,
ఏ సుఖమ్మునకన్యసుఖములు,
ఎట్టి జ్ఞానము మించి జ్ఞానము
లేదొ, అదియే బ్రహ్మము.

దేని జూచిన వేరు దృశ్యము
దేని జేరిన పునర్జన్మము,
దేని నెరిగిన నన్యజ్ఞేయము
లేదొ, అదియే బ్రహ్మము.

56. తిర్యగూర్ధ్వ మధః పూర్ణం
సచ్చిదానంద మద్వయం,
అనంతం, నిత్యమేకం, యత్
తత్ బ్రహ్మేత్యవధారయేత్.

57. అతద్వ్యావృత్తి రూపేణ
వేదాంతైర్లక్ష్యతేఽద్వయం,
అఖండానందమేకం యత్
తత్ బ్రహ్మేత్యవధారయేత్

58. అఖండానంద రూపస్య
తస్యానందలవాశ్రితాః
బ్రహ్మాద్యాస్తారతమ్యేన
భవంత్యానందినోఽఖిలాః

59. తద్యుక్త మఖిలం వస్తు
వ్యవహార స్తదన్వితః;
తస్మాత్సర్వగతం బ్రహ్మ
క్షీరే సర్పిరివాఖిలే.

60. అణ్వస్థూల మహ్రస్వ-
మదీర్ఘ మజమవ్యయం,
అరూపగుణ వర్ణాఖ్యం
తత్ బ్రహ్మేత్యవధారయేత్

అన్నిదిక్కుల, పైన, క్రిందను
నిండి, నిత్యమనంతమేకము,
సచ్చిదానందమ్ము నద్వయ
మేదొ, అదియే బ్రహ్మము.

నేతివాదముచే నఖండా-
నందు డద్వయు డనంతుండని,
ఒక్కడని, వేదాంత లెవ్వని
ఎంతురతడే బ్రహ్మము.

బ్రహ్మ మొదలుగ ఎల్లజీవులు,
ఆ అఖండానందమున, లవ-
మాత్ర మాశ్రయమంది, అందరు
పొందెదరు ఆనందము.

బ్రహ్మమన్నిట నిండియున్నది,
అన్ని పనులును నిలచు బ్రహ్మలో,
కాన, సర్వగతమ్ము బ్రహ్మము,
వెన్నవలె క్షీరమ్ములో.

అణువు, స్థూలము, పొడుగు, పొట్టియు
కాక, రూపము, గుణము, వర్ణము,
పేరులేని, అజుండు, అవ్యయు
డెవడొ, అతడే బ్రహ్మము.

61. యద్భాసా భాస్యతేఽర్కాది
భాస్యైర్యత్తు న భాస్యతే,
యేన సర్వమిదం భాతి,
తత్ బ్రహ్మేత్యవధారయేత్.

62. స్వయమంతర్బహిర్వ్యాప్య,
భాసయన్నఖిలం జగత్,
బ్రహ్మప్రకాశతేవహ్ని-
ప్రతప్తాయస పిండవత్.

63. జగద్విలక్షణం బ్రహ్మ,
బ్రహ్మణోఽన్యన్న కించన:
బ్రహ్మన్యద్భాతిచేన్మిథ్యా,
యథా మరుమరీచికా.

64. దృశ్యతే శ్రూయతే యద్యత్
బ్రహ్మణోఽన్యన్న తద్భవేత్;
తత్త్వజ్ఞానాచ్చ తద్బ్రహ్మ
సచ్చిదానంద మద్వయం.

65. సర్వగం సచ్చిదాత్మానం
జ్ఞాన చక్షుర్నిరీక్షతే;
అజ్ఞాన చక్షుర్నేక్షేత
భాస్వంతం భాను మంధవత్,

ఎవని కాంతిలో వెలుగు సూర్యా —
దులును, ఎవ్వని అవి వెలుగంగ
జేయలేవో, సర్వభాసకు
డైన యాతడె బ్రహ్మము,

జగములన్నిటి, లోన బయటను
జొచ్చి, స్వయముగ ప్రకాశింపగ
జేయు బ్రహ్మము - మంటకాగిన
అయఃపిండము రీతిగా

జగము, బ్రహ్మము విలక్షణములు;
బ్రహ్మకానిది లేదు ఎందును;
ఉన్నచో అది ఎండమావుల
వోలె, లేనటువంటిదే.

చూపునదీ, వినునట్టి దానిలో
బ్రహ్మకానిది లేదు ఎందును;
సచ్చిదానందమ్ము, అద్వయ
మనుచు నెరుగుమ బ్రహ్మమున్

ఎల్లడన్ గల సచ్చిదాత్మను
జ్ఞాననేత్రము కాంచు, కనద —
జ్ఞాననేత్రము, వెలుగు సూర్యుని
కనని అంధుని రీతిగా.

66. శ్రవణాదిభిరుద్దీప్త
జ్ఞానాగ్ని పరితాపితః
జీవస్సర్వ మలాన్ముక్తః
స్వర్ణవద్ద్యోతతే స్వయం.

67. హృదాకాశోదితో హ్యాత్మా
బోధ భాను స్తమోఽపహృత్
సర్వవ్యాపీ, సర్వధారీ
భాతి భాసయతేఽఖిలం

దిగ్దేశకాలా –
ద్యనపేక్ష్య సర్వగం,
శీతాది హృన్నిత్య –
సుఖం, నిరంజనం,
యస్స్వాత్మ తీర్థం
భజతే వినిష్క్రియః,
స సర్వవిత్సర్వ –
గతోఽమృతో భవేత్

ఇతి ఆత్మబోధః సమాప్తః

ఓం శాంతిః శాంతిః శాంతిః



శ్రవణ మననాదులచె వెలిగెడి
జ్ఞానవహ్నిలొ కాగి జీవుడు
సర్వకిల్బిషముక్తుడై, అప—
రంజివలె వెలుగొందును.

జ్ఞానభానుడు, ఆత్మ, హృదయా
కాశమున నుదయించి తమమును
చీల్చి, ఎల్లెడ నిండి, వెలుగుచు
అన్నిటిన్ వెలిగించును.

దిశలు, దేశము, కాలమనునవి
లేక, సర్వవ్యాప్తమగుచును,
చలియు, వేడియు లేని, నిత్యా —
నందమను, అతినిర్మలంబగు
స్వాత్మతీర్థము గొలుచు నెవ్వడు,
సర్వకర్మల విడిచిపెట్టిన
అతడు సర్వగతుండు, సర్వ —
జ్ఞుండు, అమరుండాతడు.

ఇట్లు ఆత్మబోధ సమాప్తము

ఓం శాంతిః శాంతిః శాంతిః

